శ్రీగణ  శాయ నమః

ఓం నమశ్శివాయ

# కైలాస సంహితా

## ప్రథమో%ధ్యాయః

## ముని ప్రశ్న వర్ణనము

అథ షష్ఠీ కైలాససంహితా ప్రారభ్యతే ||

నమశ్శివాయ సాంబాయ సగణాయ ససూనవే | ప్రధానపురుషేశాయ సర్గస్థిత్యంతహేతవే || 1

ఇపుడు ఆరవదియగుకైలాససంహిత ప్రారంభింపబడుచున్నది.

జగన్మాతతో, గణములతో మరియు పుత్రులతో కూడియున్నవాడు, ప్రకృతిని మరియు జీవులను నియంత్రించువాడు, సృష్టిస్థితిలయములకు కారణమైనవాడు అగు శివుని కొరకు నమస్కారము (1).

ఋషయ ఊచుః |

శ్రుతోమాసంహితా రమ్యా నానాఖ్యానసమన్వితా | కైలాససంహితాం బ్రూహి శివతత్త్వవివర్ధినీమ్ || 2

ఋషులు ఇట్లు పలికిరి -

సుందరమైనది, అనేకములగు గాథలతో కూడియున్నది అగు ఉమాసంహితను విని యుంటిమి, శివతత్త్వమును విశేషముగా వర్ధిల్లజేసే కైలాససంహితను చెప్పుము (2).

వ్యాస ఉవాచ |

శృణుత ప్రీతితో వత్సాః కైలాసాఖ్యాం హి సంహితామ్ | శివతత్త్వపరాం దివ్యాం వక్ష్యే వస్స్నేహతః పరామ్ || 3

హిమవచ్ఛిఖరే పూర్వం తపస్యంతో మహౌజసః | వారాణసీం గంతుకామా మునయః కృతసంవిదః || 4

నిర్గత్య తస్మాత్సంప్రాప్య గిరేః కాశీం సమాహితాః | స్నాతవ్యమేవేతి తదా దదృశుర్మణికర్ణికామ్ || 5

తత్ర స్నాత్వా సుసంతర్ప్య దేవాదీనథ జాహ్నవీమ్ | దృష్ట్వా స్నాత్వా మునీశాస్తే విశ్వేశం త్రిదశేశ్వరమ్ || 6

నమస్కృత్యాథ సంపూజ్య భక్త్యా పరమయాన్వితాః | శతరుద్రాదిభిః స్తుత్వా స్తుతిభిర్వేదపారగాః || 7

ఆత్మానం మేనిరే సర్వే కృతార్థా వయమిత్యుత | శివప్రీత్యా సుపూర్ణార్థాశ్శివభక్తిరతాస్సదా || 8

తస్మిన్నవసరే సూతం పంచక్రోశదిదృక్షయా | గత్వా సమాగతం వీక్ష్య ముదా తే తం వవందిరే || 9

సో%పి విశ్వేశ్వరం సాక్షాద్దేవదేవముమాపతిమ్ | నమస్కృత్యాథ తైస్సాకం ముక్తి మండపమావిశత్ || 10

తత్రాసీనం మహాత్మానం సూతం పౌరాణికోత్తమమ్ | ఆర్ఘ్యాదిభిస్తదా సర్వే మునయస్సముపాచరన్ || 11

తతస్సూతః ప్రసన్నాత్మా మునీనాలోక్య సువ్రతాన్ | పప్రచ్ఛ కుశలాన్ తే%పి ప్రోచుః కుశలమాత్మనః || 12

తే తు సంహృష్టహృదయం జ్ఞాత్వాతం వై మునీశ్వరాః | ప్రణవార్థవగత్యర్థమూచుః ప్రాస్తావికం వచః || 13

వ్యాసుడు ఇట్లు పలికెను -

ఓ కుమారులారా! శివతత్త్వమును ప్రధానముగా ప్రతిపాదించునది, దివ్యమైనది, శ్రేష్టమైనది అగు కైలాససంహితను మీకు ప్రేమతో చెప్పెదను. మీరు ప్రీతితో వినుడు (3). పూర్వము హిమవత్పర్వతశిఖరముపై తపస్సును చేయుచున్నవారు. మహాతేజశ్శాలురు, జ్ఞానులు అగు మహర్షులు వారాణసికి వెళ్లవలెనని సంకల్పించిరి (4). వారు దృఢనిశ్చయము గలవారై ఆ పర్వతమునుండి బయటకు వచ్చి కాశీని చేరుకొని తప్పనిసరిగా స్నానమును చేయవలెనని సంకల్పించిరి. అపుడు వారికి మణికర్ణిక కానవచ్చెను (5). అపుడు ఆ మహర్షులు అచట స్నానమును చేసి దేవతలు, గంగ మొదలగు వారికి తర్పణములనిచ్చి దేవతలకు ప్రభువగు విశ్వేశ్వరుని దర్శించిరి (6). వేదవేత్తలగు ఆ మహర్షులు అపుడు ఆయనకు నమస్కరించి పరమభక్తితో చక్కగా కొలిచి శతరుద్రీయము మొదలగు స్తోత్రములతో స్తుతించిరి (7). అపుడు శివుని యందలి ప్రీతిచే పూర్ణమైన పురుషార్థములు గలవారు, సర్వదా శివభక్తియందు ప్రీతి గల వారు అగు ఆ మహర్షులు అందరు తమను గురించి 'మేము కృతార్థులమైతిమి' అని తలపోసిరి (8). ఆ సమయములో పంచక్రోశము (విశ్వేశ్వరుని సన్నిధానమునకు ఆయిదు క్రోసుల దూరము వరకు గల పవిత్రభూమి) ను చూచు కోరికతో అచటకు విచ్చేసిన సూతుని గాంచి వారు ఆయనకు వద్దకు వెళ్లి నమస్కరించిరి (9). సాక్షాత్తుగా దేవతలకు ప్రభువు, పార్వతీపతి అగు విశ్వేశ్వరునకు నమస్కరించి ఆయన అపుడు వారితో కలిసి ముక్తిమండపములోనికి ప్రవేశించెను (10). మహాత్ముడు, పౌరాణికులలో శ్రేష్ఠుడు అగు సూతుడు అచట కూర్చునియుండగా, అపుడు ఆ మునులు అందరు ఆయనకు అర్ఘ్యము మొదలగు వాటితో పూజను చేసిరి (11). తరువాత ప్రసన్నమగు మనస్సు గల సూతుడు గొప్ప వ్రతనిష్ఠ గల ఆ మహర్షులను చూచి వారిని కుశల ప్రశ్నలను వేసెను. వారు తమ క్షేమ సమాచారమును ఆయనకు తెలిపిరి (12). సూతుని హృదయము ఆనందముతో కూడియున్నదని యెరింగి ఆ మహర్షులు ఓంకారము యొక్క అర్థమును తెలియుట కొరకై సందర్భానుసారముగా ఇట్లు పలికిరి (13).

మునయ ఊచుః |

వ్యాసశిష్య మహాభాగ సూత పౌరాణికోత్తమ | ధన్యస్త్వం శివభక్తో హి సర్వవిజ్ఞానసాగరః || 14

భవంతమేవ భగవాన్ వ్యాసస్సర్వజగద్గురుః | అభిషిచ్య పురాణానాం గురుత్వే సమయోజయత్ || 15

తస్మాత్పౌరాణికీ విద్యా భవతో హృది సంస్థితా | పురాణాని చ సర్వాణి వేదార్థం ప్రవదంతి హి || 16

వేదాః ప్రణవసంభూతాః ప్రణవార్థో మహేశ్వరః | అతో మహాశ్వరస్థానం త్వయి ధిష్ణ్యం ప్రతిష్ఠితమ్ || 17

త్వన్ముఖాబ్జపరిస్యందన్మకరందే మనోహరమ్ | ప్రణవార్థామృతం పీత్వా భవిష్యామో గతజ్వరాః || 18

విశేషతో గురుస్త్వం హి నాన్యో % స్మాకం మహామతే | పరం భావం మహేశస్య పరమా కృపయా వద || 19

ఇతి తేషాం వచః శ్రుత్వా సూతో వ్యాసప్రియస్సుధీః | గణ   శం షణ్ముఖం సాక్షాన్మహేశానం మహేశ్వరీమ్ || 20

శిలాదతనయం దేవం నందీశం సుయశాపతిమ్ | సనత్కుమారం వ్యాసం చ ప్రణిపత్యేదమబ్రవీత్ || 21

మునులు ఇట్లు పలికిరి -

ఓ మహాత్మా! సూతా! వ్యాసుని శిష్యుడవగు నీవు పౌరాణికులలో శ్రేష్ఠుడవు. శివభక్తుడవు, సకలవిజ్ఞానమునకు సముద్రమువంటి వాడవు అగు నీవు ధన్యుడవు (14). సకలజగత్తులకు గురువగు వ్యాసభగవానుడు నిన్ను మాత్రమే అభిషేకించి పురాణములకు గురువుగా నియమించెను (15). కావున ఈ పురాణవిద్య నీ హృదయములో నున్నది. పురాణములన్నియు వేదతాత్పర్యమును

బోధించును గదా! (16). వేదములు ఓంకారమునుండి పుట్టినవి. మహేశ్వరుడే ఓంకారముయొక్క అర్థము. కావున, మహేశ్వరుని ధామము నీయందు స్థిరముగా నిలబడి యున్నది (17). నీ ముఖారవిందమునుండి స్రవించే, తేనె వలె తియ్యనైన, ఓంకారముయొక్క అర్థము అనే అమృతమును ద్రావి మేము తాపమును పొగొట్టుకొనెదము (18). నీవు ప్రత్యేకించి మాకు గురుడవు. ఓ మహాబుద్ధిశాలీ! మాకు మరియొక గురువు లేడు. మహేశ్వరుని పరమతత్త్వమును మాకు దయతో చెప్పుము (19). వ్యాసునకు ప్రియమైనవాడు, గొప్ప బుద్ధిశాలి యగు సూతుడు వారి ఈ మాటను విని విఘ్నేశ్వరుని, కుమారస్వామిని, సాక్షాత్తుగా మమేశ్వరుని, పార్వతీదేవిని, శిలాదుని పుత్రుడు మరియు సుయశాదేవియొక్క భర్త అగు నందీశ్వరదేవుని, సనత్కుమారుని, వ్యాసుని నమస్కరించి ఇట్లు పలికెను (20, 21).

సూత ఉవాచ |

సాధు సాధు మహాభాగా మునయః క్షీణకల్మషాః | మతిర్దృఢతరా జాతా దుర్లభా సాపి దుష్కృతామ్ || 22

పారాశ##ర్యేణ గురుణా నైమిషారణ్యవాసినామ్ | మునీనాముపదిష్టం యద్వక్ష్యే తన్మునిపుంగవాః || 23

యస్య శ్రవణమాత్రేణ శివభక్తిర్భవేన్నృణామ్ | సావధానా భవంతో% ద్య శృణ్వంతు పరయా ముదా || 24

స్వారోచిషేంతరే పూర్వం తపస్యంతో దృఢవ్రతాః | ఋషయో నైమిషారణ్య సర్వసిద్ధనిషేవితే || 25

దీర్ఘసత్రం వితన్వంతో రుద్రమధ్వరనాయకమ్ | ప్రీణయంతః పరం భావమైశ్వర్యం జ్ఞాతుమిచ్ఛవః || 26

నివసంతి స్మ తే సర్వే వ్యాసదర్శనకాంక్షిణః | శివభక్తి రతా నిత్యం భస్మరుద్రాక్షధారిణః || 27

తేషాం భావం సమాలోక్య భగవాన్ బాదరాయణః | ప్రాదుర్బభూవ సర్వాత్మా పరాశరతపఃఫలమ్ || 28

తం దృష్ట్వా మునయస్సర్వే ప్రహృష్టవదనేక్షణాః | అభ్యుత్థానాదిభిస్సర్వైరుపచారైరుపాచరన్ || 29

సత్కృత్య ప్రదదుస్తస్మై#ై సౌవర్ణం విష్టరం శుభమ్ |

సుఖోపవిష్టస్స తదా తస్మిన్ సౌవర్ణవిష్టరే | ప్రాహ గంభీరయా వాచా పారాశర్యో మహామునిః || 30

సూతుడు ఇట్లు పలికెను -

చాలా బాగున్నది. మహాత్ములారా! మీరు నశించిన పాపములు గల మహర్షులు. పాపాత్ములకు కలుగని మిక్కిలి దృఢమైనసద్బుద్ధి మీకు కలిగినది (22). ఓ మహర్షులారా! పరాశర పుత్రుడగు వ్యాసగురుదేవుడు నైమిషారణ్యములో నివసించే మునులకు దేనిని ఉపదేశించినాడో, దానిని నేను చెప్పెదను (23). దానిని వినుట మాత్రము చేతనే మానవులకు శివభక్తి కలుగును. మీరు ఇపుడు ఆ విషయమును మహానందముతో సావధానచిత్తులై వినుడు (24). పూర్వము స్వారోచిషమన్వంతరమునందు సిద్ధులందరిచే సేవించబడే నైమిషారణ్యమునందుదృఢమగు దీక్ష కలిగి ఋషులు తపస్సును చేయుచుండిరి (25). వారు చాలకాలము వరకు కొనసాగే సత్రయాగమునుచేయుచూ, యజ్ఞమునకు ప్రభువగు రుద్రుని పరమైశ్వర్యము యొక్క తత్త్వమును తెలయగోరి ఆయనను పూజించుచుండిరి (26). శివభక్తియందు ప్రేమ గలవారు. నిత్యము భస్మను రుద్రాక్షలను ధరించువారు అగు వారందరు వ్యాసుని దర్శించే కుతూహలము గలవారై అచటనే నివసించుచుండిరి. (27). పరాశరుని తపస్సుయొక్క ఫలరూపమై ఉదయించినవాడు, సర్వాత్మస్వరూపుడు అగు వ్యాసభగవానుడు వారి మనోభావమునెరింగి సాక్షాత్కరించెను (28). ఆయనను చూచి మునులందరు ఆనందముతో నిండిన ముఖములు మరియు కన్నులు గలవారై

ఎదురేగుట మొదలగు ఉపచారములన్నింటితో ఆయనను ఆదరించిరి (29). వారు ఆయనను సత్కరించి స్వచ్ఛమగు బంగరు ఆసనమును సమర్పించిరి. అపుడా పరాశర పుత్రుడగు వ్యాసమహర్షి దానిపై సుఖముగా కూర్చుండి గంభీరమగు వాక్కుతో నిట్లనెను (30).

వ్యాస ఉవాచ |

కుశలం కిం ను యుష్మాకం ప్రబ్రూతాస్మిన్మహామఖే | ఆర్చితః కిం ను యుష్మాభిస్సమ్యగధ్వరనాయకః || 31

కిమర్థమత్ర యుష్మాభిరధ్వరే పరమేశ్వరః | స్వర్చితో భక్తి భావేన సాంబస్సంసారమోచకః || 32

యుష్మత్ప్రవృత్తిర్మే భాతి శుశ్రూషా పూర్వమేవ హి | పరభావే మహేశస్య ముక్తి హేతోశ్శివస్య చ || 33

ఏవముక్తా మునీంద్రేణ వ్యాసేనామితతేజసా | మునయో నైమిషారణ్యవాసినః పరమౌజసః || 34

ప్రణిపత్య మహాత్మానం పారశర్యం మహామునిమ్ | శివానురాగసంహృష్టమానసం చ తమబ్రువన్ || 35

వ్యాసుడు ఇట్లు పలికెను -

మీరందరు కుశలమేనా ? నాకీ సంగతి చెప్పుడు. మీరీ యజ్ఞములో యజ్ఞప్రభువును చక్కగా పూజించినారా? (31). మీరు ఈ యజ్ఞములో సంసారమునుండి విముక్తిని కలిగించువాడు, అంబాసమేతుడు అగు పరమేశ్వరుని భక్తిభావముతో చక్కగా కొలుచుటకు కారణమేమి? (32). మీ ప్రవృత్తి నాకు ముందే తెలిసినది. మీరు మహేశ్వరుడు, ముక్తికి కారణమైనవాడు అగు శివుని పరతత్త్వమును వినగోరుచున్నారు (33). మహాతేజశ్శాలియగు వ్యాసమహర్షి ఇట్లు పలుకగా, గొప్ప తపశ్శక్తి గలవారు, నైమిషారణ్యమునందు నివసించువారు అగు మునులు

(34) మహాత్ముడు, పరాశర పుత్రుడు, శివునియందలి భక్తిచే సంతోషముతో నిండియున్న మనస్సుగల వాడు అగు ఆ మహర్షికి ప్రణమిల్లి ఆయనతో నిట్లనిరి (35).

మునయ ఊచుః |

భగవన్మునిశార్దూల సాక్షాన్నారాయణాంశజ | కృపానిధే మహాప్రాజ్ఞ సర్వవిద్యాధిప ప్రభో || 36

త్వం హి సర్వజగద్భర్తుర్మహాదేవస్య వేధసః | సాంబస్య సగణస్యాస్య ప్రసాదానాం నిధిస్స్వయమ్ || 37

త్వత్పదాబ్జరసాస్వాదమధుపాయితమానసాః | కృతార్థా వయమద్యైవ భవత్పాదాబ్జదర్శనాత్ || 38

త్వదీయచరణాంభోజదర్శనం ఖలు పాపినామ్ | దుర్లభం లబ్ధమస్మాభిస్త్వస్మాత్సుకృతినో వయమ్ || 39

అస్మిన్ దేశే మహాభాగ నైమిషారణ్యసంజ్ఞకే | దీర్ఘసత్రాన్వితాస్సర్వే ప్రణవార్థప్రకాశకాః || 40

శ్రోతవ్యః పరమేశాన ఇతి కృత్వా వినిశ్చితాః | పరస్పరం చింతయంతః పరం భావం మహేశితుః || 41

అజ్ఞాతవంత ఏవైతే వయం తస్మాద్భవాన్ ప్రభో | ఛేత్తుమర్హతి తాన్ సర్వాన్ సంశయానల్పచేతసామ్ || 42

త్వదన్యస్సంశయస్యాస్య చ్ఛేత్తా న హి జగత్త్రయే | తస్మాదపారగంభీరవ్యామోహాబ్ధౌ నిమజ్జతః || 43

తారయస్వ శివజ్ఞానపోతేనాస్మాన్ దయానిధే | శివసద్భక్తితత్త్వార్థం జ్ఞాతుం శ్రద్ధాలవో వయమ్ || 44

ఏవమభ్యర్థి తస్తత్ర మునిభిర్వేదపారగైః |

సర్వవేదార్థవిన్ముఖ్యశ్శుకతాతో మహామునిః | వేదాంతసారసర్వస్వం ప్రణవం పరమేశ్వరమ్ || 45

ధ్యాత్వా హృత్కర్ణికామధ్యే సాంబం సంసారమోచకమ్ | ప్రహృష్టమానసో భూత్వా వ్యాజహార మహామునిః || 46

ఇతి శ్రీశివమహాపురాణ కైలాససంహితాయాం మునిప్రశ్నవర్ణనం నామ ప్రథమోऽధ్యాయః (1)

మునులు ఇట్లు పలికిరి -

ఓ దయానిధీ! ప్రభూ! మహాబుద్ధిశాలివగు నీవు విద్యలన్నింటియందు సమర్థుడవు (36). నీవు సకలజగత్తును సృష్టించి పాలించువాడు, జగన్మాతతో మరియు గణములతో కూడియున్నవాడు అగు మహాదేవుని అనుగ్రహములకు స్వయముగా నిధి వంటి వాడవు (37). నీ పాదపద్మముల రసమును ఆస్వాదించే తుమ్మెదలవంటి మనస్సులు గల మేము ఈనాడు నీ పాదపద్మముల దర్శనముచే కృతార్థులమైతిమి (38). నీ పాదపద్మముల దర్శనము పాపాత్ములకు లభింప శక్యము కానిది. కాని, అది మాకు లభించుటచే, మేము పుణ్యాత్ములము (39). ఓ మహాత్మా! నైమిషారణ్యమనే ఈ స్థానములో దీర్ఘకాలము కొనసాగే సత్రయాగమును చేయుచున్న మునులు అందరు ఓంకారముయొక్క అర్థమును తెలియగోరుచున్నారు (40). పరమేశ్వరుని గురించి వినవలెనని వారు దృఢనిశ్చయముతో నున్నారు. వారు ఒకరితో నొకరు మహేశ్వరుని పరమతత్త్వమును గురించి చర్చించుకొనుచున్నారు (41). కాని, అట్టి మేము ఆ తత్త్వమును తెలయలేకపోతిమి. ఓ ప్రభూ! కావున, అల్పప్రజ్ఞ గల మా సంశయములనన్నింటినీ నీవు నివారించ తగుదువు (42). ముల్లోకములలో నీవు తప్ప ఇతరులు ఈ సంశయమును తీర్చలేరు. కావున, ఆవలి ఒడ్డు లేని లోతైన అజ్ఞానసముద్రములో మునిగిపోవుచున్న మమ్ములను శివజ్ఞానము అనే పడవతో గట్టెక్కించుము. ఓ దయానిధీ! మేము శివుని యందలి సద్భక్తియొక్క తత్త్వమును తెలయవలెననే శ్రద్ధను కలిగియున్నాము (43,44). ఆ

సమయములో వేదవేత్తలగు మునులచే ఈ విధముగా ప్రార్థింపబడిన వాడై, సకలవేదముల అర్థమునెరింగినవారిలో ప్రముఖుడు, శుకుని తండ్రి అగు వ్యాసమహర్షి వేదాంతముల సారసర్వస్వమనదగిన ఓంకారమును, మరియు జగన్మాతతో కూడియున్న వాడు, సంసారమునుండి విముక్తినిచ్చువాడు అగు పరమేశ్వరుని హృదయపద్మమధ్యములో ధ్యానించి, ఆనందముతో నిండిన మనస్సు గలవాడై ఇట్లు పలికెను (45, 46).

శ్రీ శివమహాపురాణములోని కైలాససంహితయందు ముని ప్రశ్నవర్ణనమనే మొదటి అధ్యాయము ముగిసినది (1).